

# బుజ్జాయి

సంచాలకుడు: జి. ఎ. రావ్.

మన తొలి పండుగ, వినాయక చతుర్థి. ఈ శుభ సమయంలో మీ అందరి అదరాభిమానాలతో వెలుగొందుతున్న బుజ్జాయి క్రొత్త తరహాతో, వినాయకునిపై వ్యంగ్య రచనలు, .కార్టూన్లు ప్రచురించాము.

ఇవి మీకు ఆనందాన్ని - అహ్లాదాన్ని యిస్తా యని ఆశిస్తున్నాము.

అగష్టు నెలలో ప్రచురించిన ఫజిల్సు సమా ధానాలు, విజేతల పేర్లు అక్టోబరు సంచికలో ప్రచురించి, సెప్టెంబరు 10 వ తేదీకే విడుదల చేస్తాము.

—సంపాదకుడు.

సంపుటి 2 సెప్టెంబర్-76 సంచిక-2

బుజ్జాయి పబ్లికేషన్సు



Deni.

ఇదేవిటయ్యా! ఉండ్రాళ్ళన్నీ చిన్న చిన్న ముక్కలు కొరికి ప్రక్కన పెడుతున్నావ్?

నేనొక్కటే తినే లోగా మీరన్నీ తినేస్తారు స్వామీ! అందుకని ముందు ఎంగిలి చేసి ప్రక్కన పెట్టుకుంటే - తర్వాత సావకాశంగా తినొచ్చని!!










చాలా ఆకలిగా ఉంది వినాయకా!
అయ్యో! కొంచెం ముందుగా వస్తే బావుండేదా- ఇప్పుడే అన్నీ తినేశా!!


ఇవాళన్నా - నా ఆభరణాలన్నీ అలంకరించమ్మా!
అబ్బో! ఇనకం టాక్స్ వాళ్లు చూసారంటే.....


నీ మీద వేసిన కార్టూన్స్ గల పుస్తకాలు పంపేరు బాబు!
అయ్యబాబోయ్! అవి ఇప్పుడు గాని చదివితే నా పొట్ట పగిలి పోద్ది!!


కడుపు నొప్పితో కదల్లేకుండా ఉన్నా స్వామీ! వైద్యుడు దగ్గరకెళ్ళి మందు తెచ్చుకుంటా!
ఆ మందే కాస్త నాక్కూడా పట్రా వయ్యా!!
-రమేష్ బాబు



హాల్లో డాడీ!!
ఆవచ్చేది మనబ్బాయేనా?
-సుసర్ల-


నాకు జ్వరమొచ్చిం దంటే ఇక్కడకు తీసుకొస్తావా!!
పశువుల ఆసుపత్రి
చుక్కా శివ*

# కార్టూన కుడుములు





తనవాటా గానంది వాహనం ఈయకుంటే పోలీసు రిపోర్టిస్తాడట!!
చుక్కా శివ*


నీకు మరీ బుద్దీ లేదు నా పంచే ఇలా కొర్తావా!!
సుసర్ల




# ఇంతికి ఇష్టమైనది

శ్రీకృష్ణదేవరాయలకు తిరుమలదేవి, చిన్నాదేవి అని ఇద్దరు రాణులు. ఒకనాడు చిన్నాదేవికి శ్రీకృష్ణదేవరాయలతో ప్రసంగంలో ఏదోవివాదం వచ్చింది. ప్రభువువారి యందున్న మక్కువకొద్దీ చిన్నాదేవి తీవ్రంగానే వాదించింది. శ్రీకృష్ణదేవరాయలకిది భరింపరాని ఆగ్రహాన్ని కలిగించింది. చివాలునలేచి దేవీ "నీ ధిక్కరింపు హద్దుమీరింది. నీవంటి పెడసరికి మా అంతఃపురంలో చోటులేదు. నీవు నీ పుట్టింటికి వెళ్ళిపోవచ్చు. తెల్లవారితే నువ్విక్కడ ఉండడానికి వీల్లేదు వుంటే నీ తల తీసివేయబడుతుంది." అని శాసించాడు. చిన్నాదేవి బిత్తరపోయింది. నోటమాటరాక, కన్నుల నీరుకారుస్తూ ప్రభువు ముఖంలోకే చూస్తూ నిలబడిపోయింది.

"దేవీ! నీవు మాపట్ల ఎంత అవిధేయత ప్రదర్శించినా, ఇంతకాలం మా రాణిగా మమ్మల్ని సేవించినందుకు ప్రతిఫలంగా ఒకవరాన్ని అనుగ్రహిస్తున్నాం. నీ పుట్టింటికి నువ్వు కట్టుబట్టలతో పోనక్కరలేదు. నీవస్తువాహనాదులన్నింటిని నీతో తీసుకుపోవడానికి అంగీకరిస్తున్నాము వస్తువాహనాలేకాదు. ఇక్కడనీకిష్టమైనదేమైనా సరే తీసుకు వెళ్ళవచ్చు." అని చెప్పి వెళ్ళిపోయాడు శ్రీకృష్ణదేవరాయలు.

చిన్నాదేవికి యేంతోచలేదు. వెళ్ళిపోవడం ధర్మంకాదు. వెళ్ళకపోవడం నేరమౌతుంది. ఎంతఆలోచించినాఎటూ తేల్చుకోలేకపోయింది. రామలింగకవి యుక్తిగా ఈ ఉపద్రవాన్ని తప్పించగలడని అతడికి కబురు పంపించింది. రామలింగకవి వచ్చి అంతా విన్నాడు. "మీరిప్పుడు వెంటనే బయలుదేరి పుట్టింటికి వెళ్ళిపోవడమే ఉత్తమం. వెళ్ళేటప్పుడు మీరు ప్రభువారు చెప్పినప్రకారం చీనిచీనాంబరాలు, వస్తువాహనాలు, మీకిష్టమైనట్టి వాటిని అన్నింటిని మీతో తీసుకుపోవడంమాత్రం మర్చిపోకండి" అని చెప్పి రామలింగడామెకో ఉపాయాన్ని ఉపదేశించి వెళ్ళిపోయాడు.

ఆ ఉదయమే చిన్నాదేవి ప్రయాణానికి సమస్త సన్నాహాలు పూర్తిచేసుకుని, అనుమతి కోరుతూ శ్రీకృష్ణదేవరాయల్ని ఒకసారి దర్శనమిప్పించవలసినదని కబురుచేసింది. ప్రభువామె కోర్కెను మన్నించి చిన్నాదేవి మందిరానికి చేరుకున్నారు. ఎదురేగి సగౌరవంగా ఆహ్వానించింది. తన తప్పులు మన్నించమన్నది.

పి.ఐ. వీరాచార్యులు



తనను మరువవద్దన్నది. కరుణించి కడసారిగా తనతో అపూట భోజనం చెయ్యమన్నది. ప్రభు వందు కంగీకరించారు.

భోజనాలు పూర్తయ్యాయి. దాసదాసీలంతా ప్రయాణానికి సామానులు బండ్లకెత్తుతున్నారు చిన్నాదేవి ప్రభువుల కాళ్ళవద్ద కూర్చొని ఉంది. ఇంతలో కృష్ణదేవరాయలకు మగత కలిగి నిద్రముంచుకొచ్చింది. ఆమె పాదాలు ఒత్తుతూఉంటే ఆయన హాయిగా నిద్ర పోయాడు.

ఆ మర్నాటి ఉదయం తెలివి వచ్చేసరికి తాను పరాయిప్రదేశంలో ఉన్నట్టు గుర్తించాడు శ్రీ కృష్ణదేవరాయలు. వెంటనే లేచి నలు దిక్కులా కలయజూచి "ఎవరక్కడ?" అని కేకవేశాడు. వెంటనే ఒక వృద్ధనౌకరు తనవాడే వచ్చి చేతులుకట్టుకొని నిలబడ్డాడు. ఏమిటిది రంగాజయ్యా! ఇది చిన్నాదేవి మందిరమేనా? అని గద్దించి అడిగాడు. ఔను ప్రభూ ఇది చిన్నా దేవివారి పుట్టింటి సౌధము. ప్రస్తుతము తమరు అత్తవారింటఉన్నారు. దేవివారు నన్నుకూడా తమతోపాటుగా తీసుకువచ్చేరు అన్నాడు.

ఎంత సాహసం. చిన్నాదేవిని వెంటనే పిలిపించు అని గర్జించాడు. అప్పటికే అక్కడకు చేరిఉన్న రాణి లోపలకువచ్చింది. ప్రభూ! మన్నించాలి. మీ అజ్ఞప్రకారం నేను బయలు దేరి నా పుట్టింటికి వచ్చివేశాను. మీరు అనుమతించిన ప్రకారం నాకు ఇష్టమయిన మిమ్మల్ని నాతో ఇక్కడకు తెచ్చుకున్నాను. ఇంతికి భర్తకన్న ఇష్టమైనదేముంటుంది. తప్పయితే దండించండి." అని చేతులు జోడించింది. ఆమె పతిభక్తి యుక్తి రాయలవారికి ఆనందాన్ని కలిగించాయి.

"దేవీ! నీమీద విధించిన ఆంక్షను రద్దు చేస్తున్నాను. మనం వెంటనే రాజధానికి వెళ్ళాలి. అందుకు ఇప్పుడు మమ్మల్ని మీరు అనుమతించాలి. ఈ యుక్తి రామలింగనిదే అయిఉంటుంది. నా ఆవేశాన్ని, నీ అనురాగాన్ని ఇలా మేళవించిన అతడ్ని మనం సత్కరించాలి. బయలుదేరు" అని వెంటనే రాజధానికి బయలుదేరారు






(అది ఈశ్వరుని గుడిశె. గుమ్మం ముందు వినాయకుడు కూర్చొని వుంటాడు.) అంతలో ఈశ్వరుని ప్రవేశం)

ఈశ్వరుడు : ఏరా! అమ్మేదిరా?

వినాయకుడు : అమ్మ, సరస్వతి పెద్దమ్మగారింటికి వెళ్ళింది. నువ వస్తే భోజనం పెట్టుకొనితినమని చెప్పింది.

ఈ : దీన్నిగతరగ దీనికి కూర్చోవటానికి యిక్కడె క్కడా ఖాళీ లేనట్టు వాళ్ళరుగుమీదా, వీళ్ళరుగు మీదా దేకుతుందేమిటి.

వి : నాన్నా యీవేళ నా పుట్టినరోజు కదా, ఓ బెల్ బాటమ్ ఫేంటొకటి, టెరీకాటన్ చొక్కా ఒకటి కుట్టించవూ.

ఈ : ఒరేయ్, యిప్పుడు డబ్బెక్కడిదిరా. మొన్ననేగా వున్నది కాస్తా పోగుచేసి యీ యిల్లు కట్టించాను యిప్పుడు చేతిలో చిల్లిగవ్వలేదు.

వి : చిల్లిగవ్వ నాకెందుకు, బట్టలు కావాలంటుంటేనూ! అయినా డబ్బు లేదంటున్నావు. ఆ బీరువాలో డబ్బంతా ఏం చేశావు నాన్నా.

ఈ : బీరువాలో డబ్బుందని నీకెలా తెలుసు. అంటే దొంగచాటుగా ఆ బీరువా తెరుస్తున్నావన్నమాట.

వి : లేదు నాన్నా, నిన్న వుదయం అమ్మ తీసినపుడు చూశాను.

ఈ : నువ్వు నిన్న ప్రొద్దున్న చూశావు సరే. నిన్న సాయంత్రం నారదుడు వచ్చి వున్నది కాస్తా దేశ సంచారానికి తీసుకుపోయారు.

ఈ : పోనీ సింపుల్‌గా ఏమైనా పిండివంటలయినా చేయించు నాన్నా,

ఈ : ఏరా నీకు పిండివంటలు కరువా. భూలోకం వెళ్ళేవంటే నీకు బోలెడన్ని పిండివంటలు దొరుకుతాయిగా?

వి : ఆ!! భూలోకంలో నాకు యిచ్చేవాళ్ళు ఎవరున్నారు. వూరికే నైవేద్యం చూపించి, అవన్నీ వాళ్లే తినేస్తున్నారు. నాకు కనీసం ఒక్కకుడుమైనా వుంచటంలేదు.

ఈ : ఏంచేస్తార్లే. బ్లాకులో బియ్యం కొనలేక వాళ్ళే

L. జగన్ మోహన్

సదో, పరకో వందుకుంటున్నారు. సరే, అమ్మను రానియ్యి దానిదగ్గర ఏమైనా చిల్లర వుందేమో అడిగి, పిండి వంటలు వండుకుందాం.

పార్వతి : (ప్రవేశించి) ఏమిటండీ యిద్దరూ ఏదో సుదీర్ఘ చర్చలో వున్నట్టున్నారు.

ఈ : మరీ అంత నీఛంగా మాట్లాడకు. మేము ఏమైనా మినిష్టర్లమనుకొంటున్నావా, సుదీర్ఘ చర్చలు జరపటానికి.

పా : అబ్బ మీతో ప్రతీదీ గొడవే.

వి : అమ్మా మీ తగాదాలు తర్వాత ముందు నా విషయం చూడండి.

పా : నీకేమొచ్చింది.

వి : యింకా రాలేదు యిప్పుడిప్పుడే వచ్చేలాగుంది.

పా : ఏమిటి.

వి : మీతో గొడవ.

ఈ : పార్వతీ. అబ్బాయి పాపం పిండివంటలకోసం ముచ్చట పడుతున్నాడు, సరుకులు తెస్తాను. నీ దగ్గర డబ్బేమైనా వుంటే యివ్వు.

పా : నా దగ్గర డబ్బెక్కడిది. పోపు డబ్బాలోవున్న 10 రూపాయలు మీరేగా పట్టుకుపోయారు. అయినా కోమటి కామరాజు కొట్టులో మీకు కాతా వుందిగా. వెళ్ళి సరుకులు తేవచ్చుగా.

ఈ : యింకెక్కడి కాతా. యింత వరకు 100 రూ. యివ్వాలి. ఇంక అరువు ఇవ్వనన్నాడు. ప్రొద్దున్న నేను రెండు బీడీ కట్టలిమ్మంటేనే లేదు పొమ్మన్నాడు.

పా : (కోపంగా) అయితే మీరింకా సిగరెట్లు మానలే దన్నమాట.

ఈ : అబ్బే సిగరెట్లు మానేశానే. అందుకేగా బీడీలు కొంటున్నాను.

వి : నాన్నా, అమ్మా మీ గొడవ మీదేనా, నా విషయం ఏమైనా పట్టించుకొనేదుందా.

ఈ : నాకేం దారి కనబడటం లేదు.

వి : అమ్మా అదేమి. నీ చీరకొంగున ఏదియో చిన్న ముడివేసి యున్నది. ఏదియో పైకమున్నట్లున్నది చూడుము.



పా: (కొంగుముడి విప్పి) ఆ యిదిగో ప్రొద్దున్న పాలు అమ్మిన డబ్బు. ఒక్క రూపాయి.

వి: ఒక్క రూపాయా! రూపాయికి సినిమాకెళ్తే కనీసం నేల టిక్కెట్టయినా రాదే.

(బయటనుంచి పోస్ట్ అన్న కేక వినబడుతుంది. వినాయకుడు బయటకెళ్ళి వుత్తరంతో తిరిగివస్తాడు.)

పా: ఎవరి దగ్గరనుంచి.

వి: "బుజ్జాయి" పిల్లల మాసపత్రికట. ఆ పత్రిక ఎడిటరుగారు వ్రాశారు.

ఈ: ఏం వ్రాశారో చదువు.

వి: (చదువుతాడు) పార్వతీ పరమేశ్వరుల ప్రియ తమ పుత్ర రత్నము, భగవత్సరూపులు అగు వినాయకులవారికి.

అయ్యా!

మేము మీ జన్మదినోత్సవ సందర్భమున మా పత్రికలో వ్యంగ్య రచనలు, కార్టూన్లు, జోకులు, ప్రచురించ దలచుకున్నాము. మా కార్యాలయానికి అనేక రచనలు వచ్చినవి. వాటిలో మంచివి మీ చేతుల మీదుగా ఎన్నిక చేసి, ఆయా రచయిత (త్రు) లకు బహుమతులు మీ చేతుల మీదుగా యిప్పించ దలచుకున్నాం. ఈ బహుమతీ ప్రదానోత్సవానికి మీరు తప్పక రావాలని కోరుతున్నాం. మా ఎడ్రసు: బుజ్జాయి, నెం. 9, గోపాలకృష్ణ అయ్యర్ స్ట్రీట్, టి. నగర్. MADRAS-17.

పా: ఆగిపోయావే.

వి: యిక్కడేదో యింగ్లీషు వ్రాసి వుంది.

ఈ: ఏది (వుత్తరం తీసుకొని) టి. నగర్. (చదువుతాడు)

వి: నాన్నా నేను వెంటనే వెళ్ళొస్తాను. మళ్ళా ఇటువంటి అవకాశం రమ్మన్నారాదు. ఎంతో మంది పత్రికలవాళ్ళున్నారు ఎవరన్నా నన్ను పిలిచారా! ఈయనెవరో మంచి వారులాగున్నారు.

పా: కుమారా, నీకు అక్కడ దండలేమైనా వేస్తే నాకో నాలుగు పువ్వులు తెచ్చిపెట్టు.

వి: నాన్నా విమానం సిద్ధం చెయ్యి.

ఈ: విమానం కుమారస్వామి వేసుకెళ్ళాడ్రా;

వి: సరే అయితే నా ఎలుక వాహనం పైనే వెళ్ళి వత్తును. వస్తానాన్నా శలవ్. టా. టా. (వెళ్ళిపోవును.)





ఏమయ్యా పెద్దమనిషీ!
మళ్ళీ మీ అమ్మచేత తిట్టిద్దామనా?...
నేనేం నవ్వను ఫో! ఫో!!...



మీరు బరువు తగుతారో....
నన్ను ఉద్యోగం మానెయ్య
మంటారో చెప్పండి
స్వామీ!.....



ఈసారి భూలోకం వెళ్ళినపుడు
పౌడరు తేవాలి! ఈ విభూదితో
ఛస్తున్నా!.....


మిమ్మల్నిచూస్తే నేనాకు మంట
పొండి! పొండి!!

స్వాగతం!
కార్టూనిస్టులు

# కార్టూన్ స్పెషల్


మూషికవేగం చాలటంలేదు
నారదా!.... అందుకనీ.......
AIR - VINAYAKA



?!?
ఒరే తమ్ముడూ!
నా 'ఎలుక'
నువ్వు తీసుకొని
నీ 'నెమలి'
నాకివ్వరా!



అంత పొట్ట పట్టకుండా తినడమెందుకు?
ఆ చంద్రుడు నవ్వాడని
ఏడ్వడమెందుకు??!!


మావా! వినాయకుడి దగ్గర ఉద్యోగం
మానేశావేం?
ఏంచెయ్యనూ? ఆయన్ని
పిల్లంటే భయంలేని
ఎలుక కావాల్ట!




# కుశాగ్రబుద్ధి

పూర్వం కల్పాక రాజ్యాన్ని కదంబసేనుడనే రాజు పాలిస్తుండేవాడు. ఆయన పరిపాలన సమర్ధవంతంగా వుండటంవల్ల, రాజ్యంలో అరాచకాలనేవి లేకుండా సుభిక్షంగా వుంటూ వచ్చింది. ఆరాజ్యాన్ని చూస్తే, చుట్టుపట్ల రాజులకి అసూయగా వుండేది. కాని కదంబసేనుడి పేరువింటేనే కన్నెత్తి చూసేందుకుకూడా భయపడేవాళ్ళు.

ఇలావుండగా, హఠాత్తుగా కదంబసేనుడి అంతరంగకుడు కాలంచేశాడు. కదంబసేనుడికి కుడిభుజం పోయినట్లయింది. క్రొత్తవ్యక్తిని ఎన్నుకునేందుకు చాటింపువేయించాడు.

'కల్పకాన్ని' ఆనుకువే కళింగరాజ్యంవుంది. రెండింటి సరిహద్దున, ఒక సత్రం వుంది.

ఆ సత్రంలో దండపాణి, ధూమకేతు అనే యిద్దరికి స్నేహం కుదిరింది. చాటింపువిని వచ్చినవారిలో కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నది వాళ్ళిద్దరే! వాళ్ళిద్దరిలోకి శరీరధార్ఢ్యంలో దండపాణిదే పైచెయ్యిగా కనిపిస్తూంది. అంతేకాదు తెలివితేటల్లో కూడా తననిమించిన వాడేనని గ్రహించాడు ధూమకేతు. అందరిని మించిన యోగ్యత, అర్హతలు అతనికున్నాయి కాబట్టి, బహుశ అతనే ఎన్నికకావచ్చు అనుకోసాగారు అక్కడివాళ్ళంతా.

ధూమకేతుకి దండపాణిపైన ద్వేషం పుట్టుకువచ్చింది. "ఇతనే కనక లేకుంటే ఆస్థానం తనకి వచ్చివుండేది. ఎలాగైనా ఆపదవి తనకే దక్కాలి. అందుకు ముందు యితన్ని తన అడ్డునుంచి తొలగించాలి" అని తీవ్రంగా ఆలోచించి, ఒక వ్యూహం తయారు చేసుకున్నాడు.

అతను దండపాణిని పిలిచి, "మిత్రమా! ఈ రాజ్యంలో నాకు కావలసినవాళ్ళు వున్నారు.

వీరేపల్లి జయరాంరెడ్డి




వాళ్ళని చూసి రావడానికి వెళ్తున్నాను, తిరిగి వచ్చేసరికి ఒకటి రెండురోజులు పట్టవచ్చు. ఎన్నికకి యింకా మూడురోజుల గడువుందిగా! ఈలోపల నాకోసం, నాయింటినుంచి ఎవరైనా రావచ్చు. వాళ్ళకి ఈ శ్రీముఖాన్ని అందచెయ్యి. యిందులో నా క్షేమసమాచారా లున్నాయి" అన్నాడు. మిత్రుడి కపటం తెలియని దండపాణి అంగీకరించి, ఆ లేఖ తీసుకుని దాచి వుంచాడు.

ధూమకేతు సరాసరి రాజధానికి వెళ్ళి, కదంబసేనుడిని కలుసుకుని, "మహారాజా! మీ మేలుకోరి వచ్చినవాడిని. మీ రాజ్యపు తూర్పు సరిహద్దునవున్న సత్రంలో ఒక విదేశ గూడచారి వచ్చి వున్నాడు అతనిపేరు దండ



పాణి. అతను అంతరంగికపదవిని చేజిక్కించుకోవడంకోసం వచ్చివున్నాడు. కావాలంటే నేను చెప్పినట్లు చెయ్యండి. నిదర్శనం దొరుకుతుంది. అతనూ సులభంగా పట్టుబడిపోగలడు" అంటూ తన ఉపాయం విప్పిచెప్పాడు.

మర్మం ఎరగని కదంబసేనుడు, అతను చెప్పినట్లుగానే ఆ రాత్రి భటుల్ని పంపి సత్రం చుట్టూ కాపువేయించాడు. కొంతసేపటికి ఒక అశ్వికుడు అటువైపుగా వచ్చి, సత్రంలోకి వెళ్ళి దండపాణిని కలుసుకుని, ధూమకేతుకోసం వచ్చినట్లు చెప్పుకున్నాడు. దండపాణి శ్రీముఖం తెచ్చి, వచ్చినతని చేతికివ్వబోయాడు. మరుక్షణం భటులు చుట్టుముట్టారు.

అశ్వికుడు మెరుపులాగా గదిలోంచి అవతలకిదూకి, పారిపోయాడు. అతను ఎవరో కాదు, ధూమకేతు నియమించినవాడే! భటులు లేఖతోపాటు, దండపాణినిబంధించి రాజుదగ్గరికి తీసుకువెళ్ళారు. దండపాణికి అంతా అయోమయం అనిపించింది.

కదంబసేనుడు శ్రీముఖం విప్పిచూశాడు. అందులో "తను క్షేమంగా చేరినట్లు, తనే ఎన్నికయ్యే అవకాశాలున్నాయని, రహస్యాలు తెలుసుకుని త్వరలో అందచేయగలనని" శత్రురాజుకి దండపాణి వ్రాసినట్లుగా వుంది. కళ్ళారా సత్యాన్ని చూశాక, కల్పకరాజు కళ్ళు కోపంతో ఎరుపెక్కాయి.








"ఎంత మారువేషంలో వస్తేమాత్రం, అంత గుర్తుపట్టలే ననుకున్నావా! నీవంటి గూఢ చారులకి, ఆజన్మాంతర కారాగారవాసమేగతి!" అన్నాడు కదంబసేనుడు. రాజభటులు దండపాణిని బందిఖానాలో పడదోసారు. మిత్రుడు చేసిన నమ్మకద్రోహం అర్థమయింది దండపాణికి.

ఆ తరువాత కదంబసేనుడు తనకు చేసిన సహాయానికి; అంతేకాక, అందరిలోకి అతనే మేలుగా కనిపించటంచేత ధూమకేతునే అంతరంగికుడిగా నియమించు కున్నాడు. ధూమకేతు తన పథకం సవ్యంగా పారినందుకు మీసం మెలితిప్పాడు. కాని దండపాణిని చంపివెయ్యక ఖైదులో వుంచడం అతనికి కొంత అసంతృప్తిని కలిగించింది. కొద్దిరోజులు గడిచిపోయాయి.

ఒకనాటి రాత్రి ధూమకేతు తన మందిరంలో నిద్రిస్తూండగా, అతని చెంపపైన ఎవరో "చెళ్లు"మని కొట్టి మెలుకువ తెప్పించారు. ధూమకేతు కళ్ళుతెరిచి చూసి, ఎదురుగా కత్తి చేతపట్టివున్న దండపాణి కాలరుద్రుడిలా కనపడగానే, గుండె ఆగినంత పనయ్యింది. "నన్ను చంపుతావా?" అన్నాడు హీనస్వరంతో.

"చంపను! చిన్న పదవికోసం పెద్ద పథకం వేసి నన్ను బోల్తాకొట్టించిన, నీమీద నాకు నమ్మకం ఏర్పడింది. నాతో సహకరిస్తే నువ్వు మంత్రివి, నేను రాజుని కాగలుగుతాము. ముందు రాజుని మట్టుపెట్టడం నీచేతిలోపన్ని, ఏమంటావు?" అని అడిగాడు దండపాణి.

"అదెలా సాధ్యం! రాజు కుశాగ్రబుద్ధి కనిపెడ్తే ప్రాణంమీదికి వస్తుంది" అన్నాడు ధూమకేతు.

"నువ్వు నాకుచేసిన మోసం ఏమాత్రం కనిపెట్టాడు గనక, కల్పకరాజుకి నువ్వు భయపడ్డానికి అతనికి శరీరంలో బలంవుందేకాని, బుర్రలో తెలివిలేదు. ఈ విషవుపొడిని, రాజు చేత ఎందులోనైనా కలిపి త్రాగించు. ఇది ప్రాణం అలస్యంగా తీస్తుంది. అందుకు ఒక వారంరోజులు పట్టవచ్చు. నీపైన ఎవరికి అనుమానంరాదు" అనిచెప్పి వెళ్ళిపోయాడు దండపాణి.



అమర్చాడు మహారాజుని పరామర్శించేందు కన్నట్లు, అంతఃపురానికి వెళ్ళాడు ధూమకేతు. కదంబసేనుడికి పక్కనే ఒకపీఠంపైన, పానీయపుపాత్ర వుండటం గమనించాడు. ధూమకేతు చాకచక్యంగా మాటలుచెప్తూ, వుంగరంలో వుంచినపొడిని అందులో చల్లాడు. కదంబసేనుడు అదిగుర్తించక, పానీయం అందుకుని సేవించబోయాడు.

యింతలో పిడుగులాగా గవాక్షంలోంచి దండపాణి వూడిపడి "మహారాజా! ఆ పానీయం త్రాగకండి. అందులో విషం వున్నది. దాన్ని మీ అంతరంగికుడే కలిపాడు. కావాలంటే పరీక్షకి పంపండి" అంటూ ధూమకేతు వేలికి రాయి తీసివేసివున్న ఖాళీవుంగరాన్ని చూపించాడు. పానీయంలో విషాన్ని ధూమకేతు కలిపినట్లు నిర్ధారణ అయ్యింది. రాజద్రోహానికి పాల్పడినందుకు అతనికి మరణదండన విధించాడు కదంబసేనుడు.

తరువాత తన ప్రాణాల్ని కాపాడినందుకు దండపాణికి కృతజ్ఞతలు చెప్పుకుంటూ "అయితే, నువ్వు విదేశ గూఢాచారివికావా!" అని ప్రశ్నించాడు విస్మయంగా.

"చిత్తం! మహారాజా!! నేను విదేశ గూఢాచారినే. రాజ్యకాంక్షవున్న కళింగరాజు నన్ను మీ అంతరంగికుడిగాచేరి, మిమ్మల్ని మట్టుబెట్టమని నన్ను పంపాడు. కాని మీరాజ్యంలో అడుగుపెట్టాక, మీ పరిపాలనా సామర్థ్యానికి, మీ ప్రజల ఔన్నత్యానికి లొంగిపోయాను. అందుకే నా నిర్ణయం మార్చుకుని వెనక్కు వెళ్ళిపోదా మనుకున్నాను. యింతలో ధూమకేతు పదవికోసం ఉచ్చుపన్ని నన్ను యిరికించాడు. దాన్ని రుజువుపరిచేందుకే, చెరసాల నుంచి తప్పించుకు వచ్చాను. నన్ను క్షమించండి ప్రభూ!" అన్నాడు దండపాణి.

దండపాణి వున్నతవ్యక్తిత్వం కదంబసేనుడి హృదయాన్ని కదిలించి వేసింది. వెంటనే సింహాసనంనుండి దిగివచ్చి, అతన్ని కౌగలించుకుని, ఈనాటినుంచి నువ్వు నా ఆప్తమిత్రుడివి. అంతేకాదు, నా అంతరంగికుడివి కూడా" అన్నాడు.





# కలనుమించిన కల

పూర్వం ఒక గ్రామంలో శంకరయ్య అనే ఒకవ్యాపారస్తుడుఉండేవాడు. వ్యాపార రహస్యాలన్నీ వీలయినంత వరకూ ఉప ఉవయోగించిచాల డబ్బు సంపాదించాడు.

ఇతనికి ఇద్దరు కొడుకులు. రామయ్య, చంద్రయ్య అనే వీరిద్దరూ చిన్నప్పుడే తల్లిని కోల్పోయారు. పెద్దవాడు రామయ్య దుష్ట బుద్ధిగలవాడు. తమ్ముడు చంద్రయ్య తెలివిగలవాడు, మంచివాడు. శంకరయ్య వృద్ధత్వంతో మంచంపట్టాడు. ఒకరోజు శంకరయ్యకు తీవ్రంగా జబ్బుచేసింది. కొడుకులిద్దరూ తండ్రిదగ్గరే వున్నారు.

అప్పుడు రామయ్య "తమ్ముడూ! నువ్వు వెళ్ళి వైద్యుణ్ని పిలుచుకురా, పరిస్థితి విషమించింది" అన్నాడు. వెంటనే చంద్రయ్య వైద్యుడికొరకు పరుగుతీశాడు శంకరయ్య తన ప్రాణం కొద్దినిముషాల లోనే పోనున్నట్టు గ్రహించి "రాముడూ తమ్ముడెక్కడ?" అని హీనస్వరంతో ప్రశ్నించాడు.

"వైద్యుడి కొరకు వెళ్ళాడు నాన్నా" అన్నాడు. 'రాముడూ, నేనెంతోసేపు జీవించను. వైద్యుడు వచ్చేవరకు బ్రతికుండగలనన్న నమ్మకం లేదు. నేను చెప్పేది సాంతం విను' అని, "రాముడూ,చంద్రుడు కూడ ఉండివుంటే బావుండును. ఇప్పటి వరకూ నేను దాచివుంచిన రహస్యాన్ని చెబుతున్నాను. మన ఉత్తరపు ఇంట్లో పడమట గోడదగ్గర రెండు లక్షలు విలువ చేసే బంగారాన్ని దొంగల భయంతో భూస్థాపితం చేసివుంచాను. యీ రహస్యం నాకుతప్ప ఒక్క మానవుడికీ తెలియదు. నేను చనిపోయాక మీరిద్దరూ సమానంగా పంచుకోండి. జాగ్రత్తనాయనా! నాఋణం తీరిపోయింది. వ్యాపారం జాగ్రత్తగా చేసుకోండి. డబ్బువిషయంలో ఎవరినీ నమ్మ



వద్దు. కాని అందరిని నమ్మినట్లే అగు పెంచాలి" అని వ్యాపార రహస్యాలు చెప్పి కన్నుమూశాడు.

వైద్యుడికొరకు వెళ్ళిన చంద్రయ్య ఇంటికివచ్చి జరిగిందితెలిసి గొల్లుమన్నాడు. తరువాత శాస్త్రోక్తంగా దహనక్రియలు, కర్మక్రతువులు జరిగిపోయాయి.

ఒకరోజు దుష్టబుద్ధిగల రామయ్య "తమ్ముడూ, ఇప్పటివరకూ కలసిమెలసి తండ్రి సంరక్షణలో పెరిగాం. ఇకముందు మన బాధ్యతలు మనమీదే వున్నాయి. కాబట్టి నాకొకటే మార్గం కనిపిస్తోంది"అని రెండు లక్షల విలువజేసే బంగారాన్ని కాజేయాలన్న తలంపుతో విచారగ్రస్తుడై నట్టు నటిస్తూ అన్నాడు.

"అలాగే ఏమిటోచెప్పు అన్నయ్యా? అలాగే చేద్దాం" విషయం తెలియని చంద్రయ్య అన్నను ప్రశ్నించాడు.

"ఏంలేదు తమ్ముడూ మనం ఇద్దరమూ మన పిత్రార్జితాన్ని సమానంగా పంచు కుందాం. పంచుకున్నంత మాత్రాన చిన్న ప్పటినుంచి పెనవేసుకున్న మన మమకా రాలు ఎక్కడికిపోతాయి." అని అర్థిస్తు న్నట్టుగా అడిగాడు రామయ్య.

"అలాగే చేద్దాం అన్నయ్యా. నీయిష్ట ప్రకారమే కానివ్వు" అన్నాడు చంద్రయ్య.

"తమ్ముడూ! నాదొక్క చిన్నకోరికరా! చిన్నప్పటినుండి నాకీ ఇంటిమీద యీస్థలం మీద అమిత మమకారంరా. ఎందుకోగాని యీ యింటిని నేనే తీసుకోవాలని కోరికగా వుంది. అందుకు నీవు ఒప్పుకుంటావన్న గట్టినమ్మకం నాకుంది. నీకు యీ ఇంటికి బదులుగా నాభాగంలో పదిహేనువేల రూపాయలిస్తాను. ఇక్కడకు దక్షిణంగా వున్న మన ఖాళీస్థలంలో ఇల్లువేసుకో. నా కోరికను నీవు కాదనవన్న ధైర్యంతో కోరుకుంటున్నాను" అని రాముడు జవాబు కొరకు చంద్రుడివైపు చూస్తున్నాడు.

"ఎందుకన్నయ్యా రెండు ఇళ్ళుగా వున్నదికదా? వాస్తుప్రకారం దక్షిణపుఇల్లు నీవుంచుకో ఉత్తరపు ఇంటిలో నేనుం టాను." అన్నాడు.

"అదికాదు తమ్ముడూ యీ ఇంటిని పంచుకోకూడదనీ ఒకరికైతేనే బావుంటుం దని నాఉద్దేశ్యం. ఎందుకో నాకు చిన్న



ప్పటనుండి యీ స్థలంపై మమకారం పెంచుకున్నాను. నీకు ఇల్లుకట్టుకునేందుకు పది హేనువేలు కాకుంటె ఇరవైవేలు తీసుకో" డబ్బుఆశచూపి తమ్ముడిని వశ పరచుకోజూశాడు రామయ్య.



తమ్ముడు తెలివిగలవాడు. కాబట్టి ఇందులో ఏదో మోసముందని ఇట్టే పసిగట్టాడు. లేకుంటే ముష్టి ఐదువేలు చెయని పాతయింటిని తీసుకుని బదులుగా ఇరవైవేలిస్తాననటమేమిటి! అడిగితే పాతికవేలైనా ఇచ్చేటట్టున్నాడు. ఇందులో ఏదో మోసం వుంది అని అన్న బుద్ధితెలిసిన చంద్రయ్య గ్రహించి ఈ మోసానికి తగిన శాస్తి చేయా అనుకున్నాడు.

"సరేలే అన్నయ్యా నీకోరిక ప్రకారం అలాగే చేద్దాం. నాదో చిన్నకోరిక. చిన్నప్పటినుండి నాకు కాశీవెళ్ళి రావాలని వుంది. ఇద్దరం అక్కడికి వెళ్లివచ్చి తరువాత నీ యిష్టప్రకారమే పంచుకుందాం" అని చెప్పాడు చంద్రయ్య. తను మోసం గ్రహించినట్టు అన్నకు తెలియనివ్వకుండా.

రామయ్య వెంటనే "అలాగే తమ్ముడూ! రేపే ప్రయాణం. నీవు వేరే ఇల్లు కట్టినతం మాత్రాన అది నాదికాదా! యీ ఇల్లు నీది కాదా! ఇదంతా మన తండ్రి సంపాదించిందేగదా!" సంతోషపడిపోయాడు రామయ్య. బంగారం ఇక తనదైపోయినట్టే.

మరుసటి రోజు అన్నదమ్ము లిద్దరూ ప్రయాణం సాగించారు. ఆరోజంతా ప్రయాణముచేసి ఆ రాత్రికి ఒక వూరు చేరుకుని అక్కడ ఒక సత్రంలో బసచేశారు. ఆరాత్రి రామయ్య ఈ విధంగా తలపోశాడు. 'ముష్టి ఐదువేలుచేసే ఆ పాతయింటికి బదులు ఇరవైవేలు ఎందుకివ్వాలి? ఆ బంగారాన్ని స్వంతం చేసుకునేందుకు ఇది మంచి సమయం. తరువాత ఆ ఉత్తరపుఇల్లువాడి మొహానికే తగలేద్దాం' ఇలా ఆలోచించిన రామయ్య ఒక ఉపాయం ఆలోచించాడు. ఇద్దరూ నిద్రపోయారా రాత్రి సుఖంగా.

ఉదయాన తిరిగి ప్రయాణం సాగించారు. అప్పుడు రామయ్య తమ్ముడితో "తమ్ముడూ నా ఆరోగ్యం ఏం బావుండ లేదు. నీవుతిరిగివచ్చేవరకూ నేనీ సత్రంలో వుంటాను. నీవు దైవదర్శనం చేసుకుని తిన్నగా ఇక్కడకు వచ్చావంటే ఇద్దరం కలసి ఇల్లు చేరుకుందాం" అని చెప్పాడు.



చంద్రయ్య అందుకు ఒప్పుకుని 'అలాగే అన్నయ్యా! నీ ఆరోగ్యం జాగ్రత్త. నేను వస్తాను' అని చెప్పి విషయం గ్రహించిన చంద్రయ్య అన్నదగ్గర శలవు తీసుకుని కాశీవైపు వెళ్ళినట్టేవెళ్ళి అక్కడికి దాపున వున్న ఒక చెట్టువెనుక నక్కి నిలబడ్డాడు.

చంద్రయ్య ఊహించినట్టే రామయ్య తమ ఊరివైపు బయలుదేరాడు. చంద్రయ్య అన్నకు కనబడకుండా అనుసరించాడు. తిన్నగా ఇద్దరూ తమ ఇంటి దగ్గరకు వచ్చారు. చీకటి పడుతోంది. రామయ్య ఇంటిలోనికి వెళ్లి పార, పలుగు తీసుకుని ఉత్తరపు ఇంటిలోనికి వెళ్ళి లోపల గడియ పెట్టేశాడు. తనతండ్రి చెప్పినదగ్గర నేలను తవ్వాడు. ఒక పెట్టె కనబడింది. దాన్ని తీసిచూశాడు. అందులో బంగారం మెరిసి పోతూ కనిపించింది. రామయ్య ఆనందానికి అవధులు లేవు. ఇదంతా పైనున్న కటికీఎక్కి గమనిస్తూ వుండిన చంద్రయ్య "అన్నయ్యా! నువ్వా!! విచిత్రంగావుందే నీకెలా తెలుసు!! నాకు చెప్పలేదే!!" అని నవ్వుతూ అడిగాడు.

అదిరిపడిన రామయ్య సర్దుకుంటూ "రా! తమ్ముడూ రా! నీ వెలా వచ్చావిక్కడికి" అని ప్రశ్నించాడు. చంద్రయ్య గది లోపలికి ఏమీతెలియనట్లు వచ్చి కూర్చున్నాడు. అప్పుడు రామయ్య "ఇదంతా కల మహత్యం తమ్ముడూ! మనం నిన్నరాత్రి సత్రంలో పడుకున్నాంచూడు. అప్పుడు నాకు కలలో మన నాన్నకనిపించి ఉత్తరపు ఇంట్లో బంగారం భూస్థాపితం చేసి వుంచాను. దాన్ని నువ్వు, తమ్ముడూ సమంగా పంచుకోండి' అని చెప్పాడు. ఆ విషయం చెప్పితె నీవు నమ్మవని, నవ్వుతావని నిజం తెలుసుకుని తరువాత నీకు చెబుతామని అనుకుని ఆరోగ్యం సరిగా లేదని అబద్ధమాడి ఇక్కడకు వచ్చేశాను.

చంద్రయ్య అంతాగ్రహించి "నేను నిన్ను సత్రంలో వదిలి ప్రయాణం సాగించాను. మధ్యాహ్నం ఒక చెట్టునీడలో భోజనంచేసి నిద్రపోయాను. అప్పుడు నాకూ కలలో మన నాన్న కనబడి ఒరే చంద్రయ్యా మీ అన్న అక్కడ ఆరోగ్యం సరిలేక బాధపడి చనిపోతే నీవెక్కడికిరా కాశికిపోతున్నావు? ముందు వెనుదిరిగిపో అని అన్నాడు. వెంటనే భయపడి సత్రందగ్గరకు వచ్చి అడిగితే నీవు ఖాళీచేశాసేవని చెప్పారు. ఎక్కడున్నావో తెలియక తిన్నగా ఇంటి దగ్గరకు వచ్చాను. ఉత్తరపు ఇంటికి తాళం తీసివుంది, నెట్టిచూశాను. లోపల గడియపెట్టి వుంది. దొంగలేమోనని ఆకటికీ ఎక్కిచూశాను. ఇంతలో నువ్వు కనబడ్డావు ఇదీ జరిగింది" అని అన్నను తెలివిగా దెబ్బ కొట్టాడు.






# బీరబల్ యుక్తి

అక్బరు ఆస్థానంలో బీరబల్ అనే విదూషకుడు ఒకడు ఉండేవాడు. అప్పుడప్పుడు రాజును, ప్రజలను తన ప్రజ్ఞచే నవ్విస్తూయుండేవాడు. ఒకసారి సభ జరుగుతోంది. రాజు బీరబల్‌ని పిలచి చిన్న సమస్య యిస్తాను వివరించి చెప్పండి అన్నాడు. సరే! ఆ సమస్యేమిటో చెప్పండి అన్నాడు బీరబల్.

"ఇక్కడవుండి అక్కడలేనిది, అక్కడవుండి ఇక్కడలేనిది. ఇక్కడా అక్కడాలేనిది, ఇక్కడా అక్కడా వున్నది" దానికి సమాధానం ఏమిటి అన్నాడు రాజు. ప్రభూ నాలుగు రోజులు నాకు గడువు యిప్పించండి. ఆనాటికి సోదాహరణంగా మీకు తెలియపరుస్తాను అంటూ ఆనాడు కొలువునుండి శలవుతీసుకొని వెళ్ళిపోయాడు.

కాలభ్రమణంలో మూడురోజులు దొర్లిపోయాయి. నాల్గవరోజు రానేవచ్చింది. రాజు కొలువుతీర్చి యున్నాడు. ప్రజలు, రాజు బీరబల్ రాకకోసం ఎదురు చూస్తున్నారు. కొద్ది సేపటిలోనే ఒక స్త్రీని, ఇద్దరు పురుషులను వెంటబెట్టుకొని బీరబల్ సభాప్రాంగణానికి వచ్చాడు. రాజానుమతితో లోన ప్రవేశించాడు.

ఏమి చెపుతాడో, ఏమిచెపుతాడో అని ప్రజలు ఆతుర్దా ఎక్కువయింది. రాజు అనుమతితో బీరబల్ లేచి నిలబడి రాజువైపు, ప్రజలవైపు ఒకసారి చూసాడు. ప్రభూ, తమ మొదటి సమస్య ఏమిటో శలవిస్తారా అన్నాడు బీరబల్.

'ఇక్కడవుండి అక్కడలేనిది ఏమిటి అని రాజు' అన్నాడు. బీరబల్ తనవెంట తీసుకొని వచ్చిన స్త్రీనిచూపి, 'ఈమె వేశ్య, యిక్కడ ఆమె తన పాపకార్యాలతో సుఖించి, చనిపోయాక తను చేసిన పాపకార్యాలకు అక్కడ నరకం అనుభవిస్తుంది. ఇక్కడ సుఖంఉంది,

ఆర్. వామనమూర్తి

'అక్కడలేదు. అని అన్నాడు బీరబల్" మరి 'అక్కడవుండి ఇక్కడలేనిది' ఏది అన్నాడు రాజు. తనతో తీసుకువచ్చిన ఓ పురుషున్ని చూపిస్తూ, ఇతడు సాధువు. ఇక్కడ భగవత్ ధ్యానంలో గడుపుతాడు దానితోనే కృశిస్తాడు. దానివల్ల అచ్చట ఎనలేని స్వర్గం అనుభవిస్తాడు. ఇక్కడ కష్టంవుంది. అక్కడలేదు' అన్నాడు బీరబల్. 'యిక ఇక్కడా, అక్కడా లేనిదేది' అంటూ ప్రశ్నించాడు రాజు.

తను తీసుకువచ్చిన రెండవ పురుషుణ్ని చూపి అయ్యా! యితడు ఓ భిచ్చగాడు. రాత్రనక పగలనక పొట్టకోసం కష్టపడాలి. ఆ తాపత్రయంలోపడి భగవంతుణ్ని ధ్యానించలేడు. పేదవాడు అగుటవల్ల పుణ్యకార్యాలు చేయలేదు. ఎవరైన మాధవకళం లేదంటే నోటికి వచ్చినట్లు తిడతాడు. అందువల్ల యితనికి యిక్కడను, అక్కడను సుఖంలేదు' అని ముగించాడు బీరబల్. కరతాళధ్వనులు సభలో మిన్నుముట్టాయి.

మరి నాలుగోదానికి సమాధానం ఏమిటి అంటూ "ఇక్కడా అక్కడా వున్నది" అంటూ చక్రవర్తి సమస్యను ముగించాడు నవ్వుతూ.

ప్రభూ, దానికి మీరే ఉదాహరణ. ఇక్కడ మీరు ఎనలేని భోగభాగ్యాలు అనుభవిస్తారు. సుఖిస్తారు' దానధర్మాలు చేస్తారు, పుణ్యకార్యాలు నెరవేరుస్తారు. దానివల్ల అక్కడ మీరు సుఖం అనుభవిస్తారు' అంటూ ముగించాడు. బీరబల్ యుక్తితోటి చెప్పిన సమాధానాలువిని ప్రజలంతా బీరబల్‌కి జై, బీరబల్ జై అంటూ చప్పట్లు మినుముట్టేటట్లు కొట్టారు.

అక్బరుపాదుషా కూడా అతని చమత్కృతికి మెచ్చి రెండు జాగీర్లు బహుమానంగా బీరబల్‌కి యిస్తున్నానని సభలో ప్రకటించి సభను చాలించాడు.






పూర్వం దండకారణ్య ప్రాంతంలో సుదాముడనే ముని ఉండేవాడు. అతడు ముక్తిని కోరి బహుకాలం తపస్సు చేశాడు. అయినా అతడికి ముక్తి లభించలేదు.

సుదాముడు యజ్ఞంచేసి అగ్నిదేవుణ్ణి ప్రసన్నం చేసుకుని తనబాధ వెళ్ళబోసుకున్నాడు.

అప్పుడు అగ్నిదేవుడు యిలా చెప్పాడు:

"ఎన్నో జన్మలక్రితం నువ్వు పెద్ద కోటీశ్వరుడివి. ఓడలమీద వ్యాపారాలుచేసి అంతులేని ధనం సంపాదించావు. దాన్ని సద్వినియోగం చేయడానికి నీ మనసు ఒప్పలేదు. అనుభవించడానికి బిడ్డలుకూడా లేకుండాపోయారు. ఆ ధనం పరహస్తగతం అవుతుందేమోనన్న దక్షిణ సముద్రం మధ్యనగల, కుశద్వీపంలో భూగృహాన్ని నిర్మించి సంపద యావత్తూ అందులో నిక్షిప్తం చేశావు. ఆ దీవిని కాపలా కాయటానికి మహామాంత్రికుల్ని ఏర్పాటుచేశావు. మరొక జన్మలో ఎవరికయినా పుట్టి అనుభవించవచ్చునని భ్రమపడ్డావు. కాని నువ్వు ఎన్నిజన్మలెత్తినా సరే, ఆ సంపద ఎక్కడవున్నదీ ఎరుకలేకుండానే తనువులు చాలిస్తూ వచ్చావు. ఆ సంపద ఇప్పటికీ కుశద్వీపంలో చెక్కుచెదరకుండా ఉన్నది. దాన్ని నీచేతులమీదుగా వెలికితీసి, పేదసాదలకు పంచిపెట్టగలిగితే నీకు ముక్తి లభిస్తుంది." అంటూ చెప్పి అగ్నిదేవుడు అంతర్ధానమయ్యాడు.

సుదాముడు యజ్ఞంచాలించి చాలారోజులు ప్రయాణం కొనసాగించిన తర్వాత దక్షిణ సముద్రతీరం చేరుకున్నాడు. అక్కడొక బెస్తపల్లె ఉన్నది. కొందరు బెస్తలు యిసుకలో కూర్చుని చిరిగినవలలు సరిచేసుకుంటూ సుధాముడి కంటబడ్డారు.

సుదాముడు వాళ్ళను సమీపించి "నాయనలారా! అత్యవసరంగా నేను కుశద్వీపంవెళ్లాలి. నన్ను ఆ ద్వీపం చేర్చారంటే ఆ తర్వాత మీకు

ఎస్. సూర్యకుమారి





"బోలెడు ధనం బహుమానంగా యిస్తాను" అన్నాడు.

అది వింటూనే వాళ్ళు విరగబడి నవ్వి "ఏం స్వామీ! ప్రాణాలమీద ఆశలేదా? నీలాగే ఎందరో వచ్చారు. డబ్బుఆశ చూపించారు. అక్కడకు తీసుకుపోయాము. ఇంతవరకు వాళ్ళ జాడలేదు. అక్కడేదో నిధివున్నదని వాళ్లు చెప్పుకోగా విన్నాము. బహుశా నువ్వుకూడా అందుకే వెళుతున్నట్టున్నావు. ముక్కుమూసుకుని తపస్సు చేసుకునే నీవంటిమునికి డబ్బుమీద, పేరాశ ఎందుకు స్వామీ! మామాటవిని తిరిగివెళ్ళు" అన్నారు.

సుదాముడు మందహాసంచేసి "ధనం నాకెందుకు? అడవుల్లో దొరికే ఓషధులతో బంగారం తయారుచేసే ప్రక్రియ నాకు తెలుసు. వాటితో బంగారంచేసి మీవంటి పేదలకు దానంచేస్తూ పుణ్యం సంపాదించుకుంటున్నాను. అటువంటి ఓషధులు కుశద్వీపంలో ఉన్నాయని విని, యిలావచ్చాను. ఆ తర్వాత మీయిష్టం!" అన్నాడు.

అది వింటూనే బెస్తలు ఎగిరిగంతేసి "అలాగైతే రండిస్వామీ" అంటూ సుదాముణ్ణి పడవ ఎక్కించుకుని, కుశద్వీపం తీసుకుపోయారు.

అక్కడ సుదాముణ్ణి వదిలిపెట్టి "స్వామీ, మీకు కావలసిన ఓషధులేవో, వెదికి చూసుకోండి. తిరిగి మేము నెలరోజుల తర్వాత ఋదేరోజున యిక్కడికి వస్తాము" అంటూ చెప్పి బెస్తలు తెడ్లువేసుకొంటూ పడవమీద తిరిగి వెనక్కి వెళ్ళిపోయారు.

సుదాము ప్రతి అంగుళంమేర వెదుకుతూ తాను సంపదను ఎక్కడదాచిందీ గుర్తుచేసుకుంటూ దీవి యావత్తూ గాలించడం ప్రారంభించాడు.

అంతలో ఎక్కడనుంచో రెండు భయంకరమైన కుక్కలు మొరుగుతూ తన దిక్కుగా రావటం సుదాముడు చూశాడు. వాటి ఆకారాలు చూస్తూనే అతడు అదిరిపడి, పిక్కబలం కొద్దీపరుగుతీసి పెద్ద వటవృక్షమెక్కి ప్రాణాలు దక్కించుకున్నాడు.









కుక్కలు సుదాముడు ఎక్కిన చెట్టుకిందికి వస్తూనే భయంకర దేహాలుగల మాంత్రికులుగా మారిపోయాయి.

వాళ్ళు సుదాముణ్ణిచూసి "ఎవరు నువ్వు? పాపం, నువ్వుకూడా భూస్థాపితమైన నిధినిక్షితాలను చేజిక్కించు కుందామనే వచ్చిఉంటావు! అవునా?" అన్నారు వికటాట్టహాసంచేస్తూ. సుదాముడు ధైర్యం తెచ్చుకుని "నేను సర్వసంగపరిత్యాగిని. నాకు నిధినిక్షేపాలతో పనేమిటి? అదిసరే, ఇంతకీ మీరెవరు?" అన్నాడు.

"మేము ఆ నిధిని కాపాడే మాంత్రికులం, పూర్వం చందనగుప్తుడనే కోటీశ్వరుడు తన సంపద యావత్తూ ఇక్కడ దాచిపెట్టి మా పూర్వీకులను కాపలాపెట్టాడు. వంశపారంపర్యంగా యీ సంపద అన్యాక్రాంతం గాకుండా కాపాడుతామని మా పూర్వీకులు అతనికివాగ్దానం చేశారట. అందుచేత మేము చాలాకాలంగా ఇక్కడ వుంటున్నాము" అన్నారు మాంత్రికులు.

"అయితే ఆ చందనగుప్తుణ్ని నేనే! సంపద వున్న స్థలం చూపించండి. ధనాన్ని పేదసాదలకు పంచిపెట్టి, మరోజన్మ లేకుండా ముక్తిని పొందుతాను" అన్నాడు సుదాముడు సంతోషిస్తూ.

భీకరాకారు లిద్దరూ సుదాముణ్ణి చెట్టుమీద నుంచి కిందికిదించి "ఇక్కడకు వచ్చిన ప్రతివాడూ ఇలాగే చెబుతున్నాడు. అక్కడ నీకోసం



నాగలి సిద్ధంగాఉంది. పొలం దున్నాలి. పద పద!" అంటూ, అతణ్ణి విశాలంగా వున్న ప్రదేశానికి తీసుకువచ్చారు.

అక్కడ చాలామంది మనుషులు నాగళ్లకు కట్టేసిఉన్నారు. భీకరాకారులు సుదాముణ్ణి కూడా ఒక నాగలికికట్టి చీకటిపడేవరకు పొలం దున్నారు. తర్వాత వాళ్ళనందర్నీ తీసుకువెళ్ళి కర్రలతో కట్టిన అవరణలో బంధించి, తలుపులు మూసారు.

వాళ్ళల్లో, అవంతీదేశ రాజకుమారుడు శూరసేనుడనేవాడు ఉన్నాడు. అతడు సుదాముణ్ణి చూస్తూనే ఆశ్చర్యపోయి "మహానుభావా! నువ్వుచూస్తే మునిలాగ వున్నావు ఈ దుర్మార్గులకు ఎలా చిక్కావు? నీకు తపశ్శక్తి





ఉంటుందికదా! మరి వీళ్ళను ఆ శక్తితో నాశనం చేయవచ్చునే" అన్నాడు.

సుదాముడు తన సంగతి యావత్తూ శూరసేనుడితో చెప్పి "భూగృహం ఎక్కడవున్నదో వీళ్లకు తెలుసు! ఆ రహస్యం తెలుసుకోకుండా శపించడం మంచిదికాదు" అన్నాడు.

రోజూ భీకరాకారాలు వచ్చి, వాళ్లచేత పొలంపనులు, అవీ చేయించసాగారు. ఈ విధంగా దరిదాపు నెలరోజులు గడిచిపోయాయి. రోజూ దీవిలోని ప్రదేశాలు చూస్తూండడంవల్ల ఏ ప్రదేశం ఎక్కడవున్నదీ ఒక్కొక్కటే అతడికి గుర్తుకు రాసాగాయి. భూగృహం ఎటువైపున వున్నదికూడా సుదాముడికి చూచాయగా జ్ఞాపకానికి వచ్చింది.



ఒకరోజు రాత్రి సుదాముడు, శూరసేనుడి సహాయంతో తప్పించుకుని అడవిలోకి పారిపోయాడు. తెల్లవారేవరకు తిరిగి తిరిగి చివరకు ఒక లోయ ప్రాంతానికి వచ్చాడు. ఆలోయ తానెప్పుడో చూసినట్టు సుదాముడికి అనుభూతి కలిగింది. "అవును. ఇక్కడే ఎక్కడో భూగృహం ఉండాలి. ఈ లోయకు దక్షిణ దిక్కుగా నేలమాళిగ ఉన్నట్టు జ్ఞాపకం" అనుకొంటూ సుదాముడు నేలను పరీక్షగా చూసుకుంటూ వెళ్ళాడు. నిజంగానే ఒకచోట అతనికి నేలమాళిగ కనిపించింది. నేలమాళిగ తలుపులు తీస్తూనే అతనికి భూగృహం, అందులోని అంతులేని సంపదా కనిపించాయి.

అంతలో భీకరాకారు లిద్దరూ పెద్ద పెద్ద అంగలు వేసుకొంటూ అక్కడకు వచ్చి "భూగృహ రహస్యం కనిపెట్టేశా వన్నమాట. ఈ రహస్యం మాకుతప్ప ఇతరులకు తెలియకూడదు. అంటే నీకీ రోజున మాచేతుల్లో ఆయువు మూడినట్టే లెక్క" అని చెప్పి వాళ్లు హుంకరించి సుదాముడి మీద పడబోయారు.

సుదాముడు వాళ్ళ బారినుంచి తప్పించుకుని "దుర్మార్గులారా! అక్కడే ఆగండి. ఇది నాసొత్తుకాబట్టే నాకంటబడింది. తప్పు తెలుసుకుని క్షమాపణకోరితే బ్రతికిపోతారు. లేదా నా శాపాగ్నికి భస్మమైపోతారు." అన్నాడు.

ఆ వెంటనే భీకరాకారుల్లో ఒకడు నేలమాళిగలోనుంచి భూగృహం లోపలికి వెళ్లి అంత



లోనే తిరిగివచ్చాడు. వాడిచేతిలో తళ తళ మెరుస్తున్న బంగారు కలశం ఉన్నది.

దాన్ని వాడు సుదాముడి చేతబెట్టి "నేరం లేనిదే ఎవర్నీ చంపకూడదని మా పూర్వీకుల ఆజ్ఞ! ఈ కలశం ఎత్తుకుని పారిపో! నిన్ను మేము బాణాలతో కొట్టి చంపుతాం" అన్నాడు.

"సరే అయితే! ఈ నిధి నిక్షేపాలు యదార్థానికి నావే అయితే మీరు వేసేబాణాలు తిరిగి వచ్చి మిమ్మల్నే నాశనం చేస్తాయి. ఈ చిన్న విషయానికి నా తపశ్శక్తిని దారపోయడం దేనికి?" అంటూనే సుదాముడు కలశం పుచ్చుకుని పరిగెత్తాడు.

భీకరాకారులు మంత్రం జపించి, పారిపోతున్న సుదాముడికి గురిపెట్టి బాణాలు వదిలారు. ఆ బాణాలు గాలిని చీల్చుకుంటూ రయ్యిన సుదాముడి సమీపానికి వచ్చాయి. తర్వాత అంతకు రెట్టించిన వేగంతో వెనుదిరిగి వచ్చి భీకరాకారుల గుండెల్లోనుంచి దూసుకుపోయాయి.

తర్వాత సుధాముడు కుశద్వీపంలో బంధీలుగావున్న మనుషుల్ని చెర విడిపించాడు. అప్పటికి నెలరోజులు పూర్తి అయ్యాయి. ఇచ్చిన మాటమేరకు బెస్తలు పడవ తీసుకుని వచ్చారు వాళ్ళ సహాయంతో సుదాముడు, సంపదను, మనుషుల్ని అవతలి తీరానికి చేర్చాడు.

అటుపెమ్మట, సంపద యావత్తూ పేదసాదలకు పంచిపెట్టి సుదాముడు యిహలోకంలోని జంఝాటం వదిలించుకున్నాడు. దాంతో అతడికి పరలోకంలోని ముక్తి సులభంగానే లభించి కైవల్యం చేరుకున్నాడు.



# కార్టూన్ వ్యాఖ్య విజేతలు



నారదుడు:- నాయనా జీర్ణానికి ఓ రెండు మందుబిళ్ళలు వేసుకోరాదా! ఇంత ఆయాస పడకపోతే!

వినాయకుడు:- అవి పట్టేంత ఖాళీ ఉంటే మరో రెండుపళ్ళేల, పప్పుండ్లు తినేమాట కదోయ్ నారదా.

పి. వెంకటేశ్వరరావు-ఖర్గపూర్.

నారదుడు:-కంగారుగా ఏవండోయ్! "అర్జంటుగా టెలిగ్రాం వచ్చిందండి".

గణపతి:- చెప్పవయ్యా తొందరగా!

నారదుడు;- గోదావరికి వరదవచ్చి ఆనకట్టకు గండిపడిందట! మిగిలినదాన్ని పడిపోకుండా మీ బొజ్జ అడ్డుపెట్టడానికి తొందరగా రమ్మంటున్నారు.

కె. ప్రేమ్-కాకినాడ.

వినాయకుడు:- నారదా! నా వాహనము కన్పించినదయ్యా!

నారదుడు:- నీ వాహనము నీ కాళ్ళదగ్గరే ఉంది కదయ్యా! పొట్ట అంత ముందుకొచ్చేలా కుడుములు తినడం దేనికయ్యా!

వై. పోలీస్-పాటేరు.

యం. అక్బర్‌భాషా-బనగానుపల్లి.

బహుమతి 25 రూ పై 5 గురికి సమానంగా పంచబడింది.

నారదుడు:- ఎక్కడికి స్వామీ! వేంచేయుచున్నారు.

వినాయకుడు:- భూలోకానికి! లాయర్ను కలిసేందుకు.

నారద:- ఎందుకు స్వామి?

వినాయకుడు: అదేదో బుజ్జాయి పత్రికట, నామీద వ్యంగ్య రచనలను వేస్తున్నాడట, పరువునష్టం దావా వేద్దామని.

డి. శ్రీనివాసుల రెడ్డయ్య-కడప.

నారదుడు:- వినాయకా! భూలోకంలో నీ గిరాకీ తగ్గిపోయిందయ్యో!

వినాయకుడు:- ఏం? ఎందుకని!

నారదుడు:- నీకంటే పెద్దబొజ్జ గలవారు, వారిపేర్లు మంత్రులట, నీ కంటే వారికి, పూజ చేసినందువల్ల ఎక్కువ లాభాలు కలుగుతున్నాయట!

వినాయకుడు:- ఆఁ????!

ఎస్. ఉదయకుమార్-సికింద్రాబాద్.

